

# శ్రీ మహా గణాధిపతయేనమః



డా. నాగేశ్వర రావు జయంతి
జ్యోతిష శిఖామణి

జ్యోతిష శిరోమణి (కృష్ణమూర్తి పద్ధతి), ఎం.ఏ జ్యోతిష్యము , పి.హెచ్.డి – జ్యోతిష్యము
ప్లా.నం. 3/3, 2-3-364/7, రోడ్ నం. 7, సాయినగర్ కాలని, నాగోల్,
మేడ్చల్ మల్కాజిగిరి జిల్లా , హైదరాబాద్ – 500068
మొబైల్ : 9849983322

# వివాహ పొంతనము చూచే విధానము

## వివాహ పొంతనము చూసేటప్పుడు ముఖ్యము గా గుర్తుంచు కోవలసి విషయము :

1. మీ అబ్బాయి అయినను అమ్మాయి అయినను ( పొంతనము చూపించుకొనుటకు వచ్చిన వారు అమ్మాయి తరపు వారైన అబ్బాయి తరపు వారైనా ) అమ్మాయి
నుంచి అబ్బాయికి మాత్రమే చూడాలి. అబ్బాయి నుంచి చూడవలసిన అవసరము లేదు. ఎందుకంటే అమ్మాయిని క్షేత్రముగా, అబ్బాయిని విత్తనముగా పరిగనణిస్తాము. క్షేత్రము (పొలము) కొనుక్కునేటప్పుడు క్షేత్రమునకే (పొలము) ప్రాధాన్యము ఇస్తాము గనుక, ఇక్కడ కూడా క్షేత్రాముగా భావించే అమ్మయి నుంచి మాత్రమె చూడాలి.

## వివాహ పొంతనమునకు పరిశీలించాల్సిన విషములు :

అ. లగ్నము నుండి ( వివరణ _ చిత్ర పటము క్రింద ఇవ్వబడినది) (లగ్నము శరీరముగా భావిస్తాము గనుక ఇద్దరి శరీరములు ఎంతవరకు
సానుకూలముగా ఉండును అన్న విషయ పరిశీలనకు) **దీని ఫలితము శారీరకముగా ఉండును**

- లగ్న ద్వి - ద్వాదశములు కాకూడదు (2 – 12 )

అమ్మాయి లగ్నము నుండి అబ్బాయి లగ్నము 2 వ స్థానము అయినచో అబ్బాయి నుండి అమ్మాయికి 12 వ స్థానము అగును.
ద్వితీయము (2) కుటుంబము , ద్వాదశము (12) సుదూరముగా ఉండుట, మోక్షము ను సూచిస్తాయి కనుక 2-12 పనికి రాదు

**అబ్బాయి రాశి చక్రము**

| | | | |
|---|---|---|---|
| | లగ్నము | | రాహు |
| శని | | | చంద్ర |
| గురు | | | కుజ |
| కేతు | | రవి బుధ | శుక్ర |

**అమ్మాయి రాశి చక్రము**

| | | | |
|---|---|---|---|
| లగ్నము | రాహు | | రవి |
| | | | గురు |
| కుజ | | | |
| చంద్ర | శని | కేతు | బుధ శుక్ర |

- లగ్న షష్టాష్టకములు కాకూడదు ( 6- 8 )
- అమ్మాయి లగ్నము నుండి అబ్బాయి లగ్నము 6 వ స్థానము అయినచో అబ్బాయి నుండి అమ్మాయికి 8 వ స్థానము అగును.
- షష్ఠ (6) శత్రుత్వము , కలహములు , అష్ఠ (8) ఆకస్మికము, ఆయుర్దాయము ను సూచిస్తాయి కనుక 6-8 అయినచో వీరు జీవితములో ఎల్లప్పుడూ అనవసర కలహాములతో ఇబ్బంది పడే అవకాసముండును. దీని ద్వారా వీరి జీవితము శుభ ప్రదము కాదు కనుక పనికి రాదు

| | | | |
|---|---|---|---|
| | కుజ | రాహు | శుక్ర |
| రవి గురు | **అబ్బాయి రాశి చక్రము** | | చంద్ర |
| | | | శని |
| బుధ | కేతు | | **లగ్నము** |

| | | | |
|---|---|---|---|
| రాహు | **లగ్నము** | | బుధ |
| శుక్ర | **అమ్మాయి రాశి చక్రము** | | గురు |
| శని | | | |
| రవి | చంద్ర | కుజ | కేతు |

ఆ. **చంద్రుని నుండి (వివరణ _ చిత్ర పటము  క్రింద ఇవ్వబడినది) దీని ఫలితము మానసికముగా ఉండును**

**( ఇద్దరి మనసులు ఎంతవరకు సానుకూలముగా ఉండును అన్న విషయ పరిశీలనకు)**

చంద్ర ద్వి- ద్వాదశములు కాకూడదు (2 – 12 )

**అమ్మాయి జన్మ రాశి నుండి – ఇది మనసుకు చెందినది గనుక)** అమ్మాయి జన్మ రాశి నుండి అబ్బాయి జన్మరాశి 2 వ స్థానము అయినచో అబ్బాయి నుండి అమ్మాయికి 12 వ స్థానము అగును

ద్వితీయము (2) కుటుంబము , ద్వాదశము (12) సుదూరముగా ఉండుట, మోక్షము ను సూచిస్తాయి కనుక 2-12 పనికి రాదు

| | | | |
|---|---|---|---|
| | లగ్నము | | రాహు |
| శని | **అబ్బాయి రాశి చక్రము** | | **చంద్ర** |
| గురు శుక్ర | | | కుజ |
| కేతు | | రవి బుధ | |

| | | | |
|---|---|---|---|
| లగ్నము | రాహు | | రవి |
| | **అమ్మాయి రాశి చక్రము** | | గురు |
| కుజ | | | **చంద్ర** శుక్ర |
| | శని | కేతు | బుధ |

- చంద్ర షష్ఠాష్ఠకములు కాకూడదు ( 6- 8 )

అమ్మాయి జన్మ రాశి నుండి అబ్బాయి జన్మరాశి 6 వ స్థానము అయినచో అబ్బాయి నుండి అమ్మాయికి 8 వ స్థానము అగును.
షష్ఠ (6) శత్రుత్వము , కలహములు , అష్ఠ (8) ఆకస్మికము, ఆయుర్దాయము ను సూచిస్తాయి కనుక 6-8 అయినచో వీరు జీవితములో ఎల్లప్పుడూ అనవసర కలహాములతో ఇబ్బంది పడే అవకాసముండును. దీని ద్వారా వీరి జీవితము శుభ ప్రదము కాదు కనుక పనికి రాదు

| | | | |
|---|---|---|---|
| | కుజ | రాహు | శుక్ర |
| రవి<br>గురు | **అబ్బాయి రాశి చక్రము** | | |
| లగ్నము | | | శని |
| బుధ | కేతు | | **చంద్ర** |

| | | | |
|---|---|---|---|
| రాహు | లగ్నము<br>**చంద్ర** | శుక్ర | బుధ |
| | **అమ్మాయి రాశి చక్రము** | | గురు |
| శని | | | |
| రవి | | కుజ | కేతు |

ఇ.  చంద్ర నవ -  పంచకములు  కాకూడదు ( 9 – 5) ( అమ్మాయి జన్మ రాశి నుండి అబ్బాయి జన్మరాశి 9 వ స్థానము అయినచో  అబ్బాయి
నుండి అమ్మాయికి 5 వ స్థానము అగును  – ఇది వైధవ్యమునకు దారితీయును)

| | | | |
|---|---|---|---|
| శని | | లగ్నము కేతు | గురు |
| రవి | **అబ్బాయి రాశి చక్రము** | | |
| కుజ | | | బుధ |
| | రాహు చంద్ర | శుక్ర | |

| | | | |
|---|---|---|---|
| చంద్ర | | రాహు | లగ్నము |
| | **అమ్మాయి రాశి చక్రము** | | గురు |
| బుధ | | | శని |
| | కేతు | | రవి కుజ |

ఈ.	కుజ దోషము ( వివరణ క్రింద ఇవ్వబడినది)

## కుజ దోషమనగానేమి (ఇరువురికి కుజ దోష పరిశీలన చేయవలెను)

1. కుజుడు లగ్నమునుండి గాని, చంద్రుని నుండి గాని, శుక్రుడు నుండి గాని, 1,2,4,7,8 మరియు 12 స్థానములలో ఉన్నచో ఆ జాతకునికి కుజదోష
మున్నదని చెప్పవచ్చు. ఉదాహరణలు ఈ క్రింద పట్టికలో వివరించబడినవి.

2. జాతక వివాహ పొంతనము చూచునపుడు వరుడు, వధువు జాతకములలో కుజదోషముండవలెను లేదా ఒకరికి వుండి వేరొకరికి మినహాయింపు వున్నను
ఆ పొంతనము సరియగునని భావించి వివాహము చేయవచ్చును. మినహాయింపులు ఈ క్రింద పొందుపరచడమైనది.

- **జాతకుని చక్రములో కుజుడు పాప గ్రహములైన రవి, శని, రాహు, కేతు లతో గాని, గురువుతో గాని కలసియున్న కుజునికి దోషము అంటదు.**
**(కుజ దోషము లేనట్లుగా భావించవచ్చు ).**
- **అలాగే వారి లగ్నము గనుక** మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుష్, మకర, మీనము లైనచో కూడా కుజ దోషము అంటదు. కుజదోషము లేని వారు కుజదోష మున్న, లేని వారితోనైన లేదా కుజ దోష మినహాయింపు వున్నవారితోనైన ఇచ్చి వివాహము చేయవచ్చును.

## లగ్నము నుండి కుజ దోష పరిశీలన :

| | | | |
|---|---|---|---|
| కుజ | లగ్నము<br>కుజ | కుజ | |
| | లగ్నము<br>నుండి<br>అబ్బాయి రాశి<br>చక్రము కుజ<br>దోషము | | కుజ |
| | | | |
| | కుజ | కుజ | |

| | | | |
|---|---|---|---|
| లగ్నము<br>కుజ | కుజ | | కుజ |
| కుజ | లగ్నము<br>నుండి<br>అమ్మాయి రాశి<br>చక్రము కుజ<br>దోషము | | |
| | | | |
| | | కుజ | కుజ |

## చంద్రుడు నుండి కుజ దోష పరిశీలన :

| | | | |
|---|---|---|---|
| కుజ | చంద్ర కుజ | కుజ | |
| | చంద్రుని నుండి అబ్బాయి రాశి చక్రము కుజ దోషము | | కుజ |
| | | | |
| | కుజ | కుజ | |

| | | | |
|---|---|---|---|
| చంద్ర కుజ | కుజ | | కుజ |
| కుజ | చంద్రుని నుండి అమ్మాయి రాశి చక్రము కుజ దోషము | | |
| | | | |
| | | కుజ | కుజ |

## శుక్రుడు నుండి కుజ దోష పరిశీలన :

| | | | |
|---|---|---|---|
| కుజ | శుక్ర కుజ | కుజ | |
| | శుక్రుని నుండి అబ్బాయి రాశి చక్రము కుజ దోషము | | కుజ |
| | | | |
| | కుజ | కుజ | |

| | | | |
|---|---|---|---|
| శుక్ర కుజ | కుజ | | కుజ |
| కుజ | శుక్రుని నుండి అమ్మాయి రాశి చక్రము కుజ దోషము | | |
| | | | |
| | | కుజ | కుజ |

## కుజ దోషమునకు గల మినహాయింపులు (Exemptions)

- జాతకుని చక్రములో కుజుడు పాప గ్రహములైన రవి, శని, రాహు, కేతు తో గాని, గురువుతో కలసియున్న కుజునికి కుజదోషము అంటదు.
- **అలాగే వారి లగ్నము గనుక మేష, కర్కాటక, సింహ, వృశ్చిక , ధనుష్ , మకర, మీనములైనచో కుజదోషము అంటదు.**
- కుజదోశషమున్నవారిని కుజదోష మున్నవరితోనైన లేదా కుజ దోష మినహాయింపు వున్నవారితోనైన ఇచ్చి వివాహము చేయవచ్చును.

ఉ.	రజ్జు దోషము ( వివరణ పట్టిక క్రింద ఇవ్వబడినది)

## రజ్జు దోషమనగానేమి

- 27 నక్షత్రములకు మన శరీరములోని 5 భాగములను ఆపాదించారు.
- కుజ నక్షత్రములను మినహాయించి మిగిలిన నక్షత్రములలో 6 నక్షత్రములకు ఒక భాగము కేటాయించబడినది.
- ఏక రజ్జు భాగములో పడు నక్షత్రములకు వివాహము చేసిన అది వైధవ్యమునకు దారి తీయును.
- మన పూర్వీకులు నక్షత్రములో పాద భేదమున్న చేయవచ్చునని తెలిపి యున్నారు.
- కాని నా అనుభవములో అతుల చేసినచో అది వైధ్యమునకు దారి తీసినవి.

కేతు, బుధ నక్షత్రములకు – పాద భాగము , శుక్ర, శని నక్షత్రములకు – కటి భాగము , రవి, గురు నక్షత్రములకు – ఉదర భాగము, చంద్ర, రాహు నక్షత్రములకు – కంఠ భాగము, కుజ నక్షత్రములకు – మస్తక భాగము

| రజ్జు దోషము - నక్షత్రములు శరీరములోని భాగములు | | |
|---|---|---|
| నక్షత్రములు | గ్రహము | శరీరభాగము |
| **అశ్విని, మఖ, మూల** | **కేతు** | **పాదము** |
| **ఆశ్లేష , జ్యేష్ఠ, రేవతి** | **బుధ** | |
| **భరణి, పుబ్బ, పూర్వాషాడ** | **శుక్ర** | **కటి** |
| **పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర** | **శని** | |
| **కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాడ** | **రవి** | **ఉదరము** |
| **పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర** | **గురువు** | |
| **రోహిణి, హస్త, శ్రవణ** | **చంద్ర** | **కంఠము** |
| **ఆరుద్ర, స్వాతి, శతభిషము** | **రాహు** | |
| **మృగశిర, చిత్త, ధనిష్ఠ** | **కుజ** | **మస్తకము** |

## ఊ.  గుణములు :

### *పంచంగాములో  గుణమేళన చక్రము చూడండి*

**గుణ (కూట) మేళనము చూచుటకు 8 రకముల పొంతనములు పరిశీలిస్తాము అవి :**

1. *వర్ణ*
2. *వస్య*
3. *దిన / తార*
4. *యోని*
5. *గ్రహ మైత్రి*
6. *గణ (దేవ/రాక్షశ /మానవ)*
7. *రజ్జు ( పట్టిక ఈయబడినది వివరముగా)*
8. *నాడి*

*ఇవి 8 రకములు ఇవి వరుసగా 1+2+3+4+5+6+7+8 = 36 మొత్తము పాయింట్స్. మనము 50% అంటే దీనిలో సగ భాగము వచ్చినచో వివాహపొంతనము ఈ ( గుణమేళనము కు సంబందించినంతవరకు ) కుదిరినదని భావించవచ్చు*

## ఏ. తారాబలము

- తారబలము చూసేటప్పుడు సంపత్ -2 , క్షేమ - 4 , సాధన - 6, మిత్ర – 8, పరమమిత్ర - 9 అయినచో పనికి వచ్చును
- నైధన – 7 (నిధనము అంటే మృత్యువు కనుక అస్సలు పనికి రాదు)
- జన్మ తార 1, విపత్తార – 3, పత్యక్తార – 5 – ఈ మూడింటికి నవకములలో ఉపశమనము ఈయబడినది అవి మనము నక్షత్రములు లెక్కించేటప్పుడు (అంటే నక్షత్రములు వ్రేళ్ళ మీద 1 నుండి తొమ్మిది వరకు వెళ్లి అక్కడినుండి మరల ఒకటి నుండి లెక్కిస్తారు అలా మూడు
  భాగములుగా 27 నక్షత్రములను చేసినప్పుడు దీనినే నవకఉలు అంటారు).
- ఆరోజు నక్షత్రము నుండి జన్మ నక్షత్రము వరకు లెక్కించగా మొదటి నవకములో 5 వ తార ప్రత్యక తార , 2 వ నవకములో విపత్తార 3 వ నవకములో జన్మతార పనికి వచ్చును .

ఒక వేళ ఈ నవకములలో ఉపశమనము కాక పోయినను, పైన ఈయబడిన అన్ని ( లగ్నము నుండి, చంద్రుడి నుండి, కుజ , రజ్జు దోషములలో ఏ ఇబ్బంది లేనప్పుడు ) వీటికి పరిహారములు సూచించబడినవి. అవి వివాహము అయిన తరువాత నూతన దంపతులచే :

1. జన్మతారకు - తోటకూర 2. విపత్తారకు - బెల్లము (గుడము) 3 ప్రత్యక్ తారకు – లవణము (ఉప్పు) దానము చేయించి పరిహారము పొందవచ్చును.

జనన వివరములు పూర్తిగా లేనప్పుడు వీరికి నామనక్షత్రముల ప్రకారము ,

1. చంద్ర 2-12, 6-8, 9-5, అయినను 2. రజ్జు దోషమున్నను 3. తారబలము – నైధన తార అయినను పొంతనము కుదరలేదని చెప్పవచ్చును .

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహములు | | | కేతు | శుక్ర | రవి | చంద్ర | కుజ | రాహు | గురు | శని | బుధ |
| ఆరోజు / అబ్బాయి నక్షత్రములు | | | అశ్విని<br>మఖ<br>మూల | భరణి<br>పుబ్బ<br>పూర్వాషాఢ | కృత్తిక<br>ఉత్తర<br>ఉత్తరాషాఢ | రోహిణి<br>హస్త<br>శ్రవణం | మృగశిర<br>చిత్త<br>ధనిష్ఠ | ఆరుద్ర<br>స్వాతి<br>శతభిషం | పునర్వసు<br>విశాఖ<br>పూర్వాభాద్ర | పుష్యమి<br>అనూరాధ<br>ఉత్తరాభాద్ర | ఆశ్లేష<br>జ్యేష్ఠ<br>రేవతి |
| అమ్మాయి/జన్మ నక్షత్రములు | | | దినాధి పతులు - తారాబలం - చంద్రబలం | | | | | | | | |
| అశ్విని | మఖ | మూల | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 |
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ఠ | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 |
| ఆరుద్ర | స్వాతి | శతభిషం | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 |
| 1. జన్మ తార 2. సంపత్ 3.విపత్ 4.క్షేమ 5. ప్రత్యక్ 6. సాధన 7. నైధన 8. మిత్ర 9 పరమమిత్ర | | | | | | | | | | | |

